గోలకొండపత్రిక

తారణ సం॥ర ఆషాఢ బ॥ ౧౫ గురువారము

# అపర బర్మింగ్‌హాం

హైదరాబాదు రాష్ట్రములో గోదావరీతీరంలో ఎచ్చటనో (అదింకా రహస్యముగానే యున్నట్లున్నది.) యుద్ధం ముగిసిన వెంటనే రెండవ బర్మింగ్‌హాం నగరం సిద్ధము కాగలదని మన దినపత్రికల్లో వార్తలను వదలుతున్నారు. ఆ వార్తలకు ఎవ్వరు బాధ్యులో స్పష్టమగుట లేదు. ఆంగ్లదేశములో బర్మింగ్‌హాం అంటే యంత్రాలనగరం. అక్కడ అన్నీ మిల్లులే, అన్నీ యంత్రాలే. వాటిని ఆశ్రయించుకొని బ్రతికేవారే అందు లక్షల కొలది నిండిపోయినారు. ఆవిధంగానే జాదూనగర మొకటి మన గోదావరీ తీరములో ఏర్పడనున్నదట!

యుద్ధానంతర నిర్మాణ ప్రణాళికను సిద్ధంచేసేదానికి ఒక కచ్చేరీని మన ప్రభుత్వమువారు స్థాపించినారు. బ్రిటిషిండియాలో స్థాపించినారు కదా. అందుచేత మనవారున్నూ స్థాపించినారన్నమాట. అయితే మన దేశము యంత్రాలదేశమవుతుందన్న మాటనే కాస్త నమ్మవలెనంటే కష్టంగా కనబడుతుంది. ఇంతవరకు మన దేశములో అధికసంఖ్యాక ప్రజలు వ్యవసాయ [illegible]లేదు. ఎక్కడా దిక్కులేక అక్కమగడే గతి అన్నట్లు ప్రజలు అటుతిరిగి యిటుతిరిగి మళ్ళీ భూదేవినే ఆశ్రయించుతూ వచ్చినారు. ఈవృద్ధి యెట్టిదనగా:

| సంవత్సరం | వ్యవసాయాధారంగల జనులు లక్షయింటిలో |
|---|---|
| ౧౮౯౧ లో | ౬౧౦ ఉండిరి |
| ౧౯౦౧ | ౬౫౩ |
| ౧౯౧౧ | ౬౯౮ |
| ౧౯౨౧ | ౭౦౯ |
| ౧౯౩౧ | ౭౫౦ |

ఇవి మొత్తం హిందూస్థానములోని లెక్కలపట్టీలు. హైదరాబాదు రాష్ట్రములో సరిహద్దుజిల్లాలలో బ్రిటిషిండియావారు యీ ౨౦ ఏండ్లలో ౨౦ లక్షలవరకైనావచ్చి నిండిపోయినారు. ముల్కీల భూములు లక్షలయెకరాలు వారిచేతులలోనికి పోయినవి. అవి చాలవని పంజాబునుండి వ్యవసాయకులను నిజాంసాగరు క్రిందికి దిగుమతిచేసిరి. ఇట్టి పరిస్థితులలోను మనరాష్ట్రం అకాండ తాండవముతో పరిశ్రమల కేంద్రమగునంటే నమ్ముట కష్టంగానున్నది.

మరొక మాటనుగూడా మనదృష్టిలో నుంచుకోవలెను. బ్రిటిషు ప్రభుత్వము భారతదేశములో పరిశ్రమలకు మనఃపూర్వకముగా ఎన్నడున్నూ దోహదమిచ్చియుండలేదని భారతీయార్థికవేత్తలు, రాజకీయనాయకులు వ్రాయుచూవచ్చినారు. మితవాద నాయకులే యెక్కువగా ఈ అభిప్రాయాల నిచ్చియుండిరి. సర్. మోక్షగుండముగారు ఒక తరమునుండి భారతదేశములో పెద్ద పరిశ్రమలను (Heavy industries) స్థాపించవలెనని ఆందోళన చేయుచునే యున్నారు. యుద్ధానికిపూర్వం యుద్ధారంభములోనూ మోటారు యంత్రాలయానికి ప్రభుత్వానుమతిని ప్రార్థించియుండిరి. కాని ఇష్టములేని మొచ్చటకు ఎన్నెన్నో కారణాలు చూపించి పెద్దసున్నచుట్టిరి. హిందూస్థానం కొనవలెను. ఇంగ్లండు అమ్మవలెను. ఇది బ్రిటిషు ఆర్థికవేత్తల సిద్ధాంతం. అటు కాక హిందూస్థానం ఇంగ్లీషు వస్తువులను కొనకుంటే ఇక దానివల్ల ఇంగ్లీషువారి కేమిలాభం? హిందూస్థానం కూడా యంత్రాలను పెట్టుకొని వస్తునిర్మాణం చేస్తే అది ఇంగ్లండుకు గట్టిదెబ్బ. ఆ దెబ్బలు వారుతినుటకు సిద్ధముగానున్నారా? ఇంగ్లీషువారికి నష్టంలేని వ్యవహార మెంతచేసినా బాధలేదు. ఈదృష్టితో మన అపరబర్మింగ్‌హాంపట్టణ జాదూనగరీని భూతద్దాలతో చూడవలసి యుంటుంది. మన ప్రభుత్వమువారు తమ ప్రణాళిక యెట్టిదో తెలుపనంతవరకు యేపత్రికావార్తనో పట్టుకొని ఆ నీలివార్తయే గట్టిముచ్చటఅని నమ్మి విమర్శించుటకు వీలులేదు. ౧౦౦ కోట్ల పరిశ్రమలంటే సామాన్యమైన విషయమా? అంతటి పెద్దవిషయాన్ని రాష్ట్రీయులు బాగా తెలుసుకొని తమ అభిప్రాయాలిచ్చునట్లుగా ప్రభుత్వమువారు ప్రకటించుట చాలా అవసరము

ఇంకో విషయాన్నికూడా గమనించవలెను. యుద్ధానంతరము హిందూస్థానాన్ని ఉద్ధరించే నిమిత్తం బ్రిటిషుప్రభుత్వమువారు కొన్ని కమిషన్లను ఏర్పాటు చేయుచున్నారు. ఆ కమిషనులలో అంతా ఇంగ్లీషు దొరలే ఉన్నారు. ముందు కాలములో హిందూస్థానంభూములకు అమ్మోనియా సల్ఫేట్ సప్లయిచేసేదానికొక కమిషనేర్పాటైనది. దానినిగూర్చి కామనుల శాసనసభలో లిటిల్‌టక్ అనే అతడిట్లన్నాడు

"హిందూస్థానంలో వ్యవసాయానికి మంచి రసాయనపు యెరువులు మనం సప్లయిచేస్తే చాలా ఉపకారం చేసినవార మౌతాము ఇండియా వీటిని సిద్ధముచేయజాలదు. కాన మన యెరువుల సప్లయి వల్ల మనకక్కడ మంచిమార్కెటు లభించును"

"We should have created a market which would absorb some industrial products which India cannot make herself."

ఇట్టి కమిషనులు ఇంకా కొన్ని ఏర్పాటైనవి. మేము కొన్ని మాసాలక్రిందట హైదరాబాదులో అమ్మోనియం సిద్ధంచేసే యంత్రాలు స్థాపించవలెనని వ్రాసియుంటిమి. ఈ అపరబర్మింగ్‌హాంలో అది సిద్ధమగునా?

మన అపర బర్మింగ్‌హాంలో ఏమేమి పరిశ్రమలు స్థాపింపనున్నారో తెలుపవలెను. అవి దేశానికి లాభకరమా, బయటిదేశాల పోటీకినిలుచునా, తెలుపవలెను. అక్కడ ఉక్కు, ఇనుము పనులను చేయుదురని అంటారు. మైసూరులోని భద్రావతీ పరిశ్రమాగారములో ఇవే సిద్ధమవుచుండెను. చాలా నష్టం వచ్చెను. ఆపివేసే స్థితికివచ్చెను. కాని యుద్ధమూలాన లాభించెను. యుద్ధం దానికొరకై అట్లె సాగనేరదు కదా. దానిగతి అట్లుండినప్పుడు మన క్రొత్త యంత్రాలయములో అది లాభించునా?

అపర బర్మింగ్‌హాం పరిశ్రమలలో ముల్కీ ధనికులపైకం వినియోగమగునా లేక యెవరైనాసరే అందు చేరవచ్చునా? వాటాలకుగవర్న మెంటు గ్యారంటీ యుండునా. ఇట్లాంటి వివరణ చాలా తెలుసుకొనవలసి యుండును.

ప్రభుత్వమువారు సత్యమెంతనో బయటపెట్టవలెనని కోరుతున్నాము.

## బేగంబజారు పేరు మార్పులో నిర్ణయం

వక్త్ పత్రికలో ౬-౧౦-౫౩ నాడు వ్రాసినదానిపై,

మ. ఘ. వ. నిజాంగారు ౯-౧౦-౫౩ నాటి నుశేదక్కనులో ఇట్లు లిఖించినారు.

"పూర్వకాలపు స్థలాలపేర్లు అందరినోళ్ళలో పడి వ్యవహారమై పోయినవి. అట్టిపేర్లను మార్చటాల ఆం జాతివారు ముస్లింసోదరవర్గము చందావేసుకొని ఏదైనా క్రొత్తవస్తువునునిర్మించి స్మారకంగా స్థాపించితే అది వేరుమాట. కాని అట్టిపై మెరుగులవల్ల కూడా ఏమిన్ని లాభంలేదు. ఆటుకాక కీర్తిశేషుడైన నాయకుడు వీపనియొక్కపునాదినివేసి దానిని పూర్తిచేయుటకై మనము యొక్కయు వర్గముయొక్కయు చేతులలో పెట్టిపోయినాడో అది అన్నింటికన్న ముఖ్యమైనపని ఆ పని అతనినామధేయమును దక్కనులో శాశ్వతముగా సజీవముగా నుంచగలదు దీనిని దృష్టిలో నుంచుకొని లాభంలేని సమాలోచనలను చేయరాదు. వీటివల్ల కాలహరణమేకాక వీటిపై చర్య తీసుకొనబడదు"

వక్త్ పత్రికలో ఇట్లు వ్రాసియుండిరి. బహదూరు యార్జంగు గారుండినది బేగంబజారులో, ఆ బజారుకు స్త్రీపేరుండుట, బహదూర్ ఉండిన వీధి అది. కావున అతని స్మారకముగా ఆ వీధికిమాత్రము బహదుర్‌ఖాను వీధి అనుట న్యాయం (గో-ప)

---

నేలకొండపల్లిలో ౧౩-౭-౪౪ నాడు శ్రీ విరాట్ ఆంధ్ర భాషానిలయంలో శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారి జయంతి జరుపబడెను సమావేశమునకు శ్రీరావులపాటి రంగారావుగారు అధ్యక్షత వహించిరి, శ్రీ శ్రీ శ్రీ లక్ష్మణరావుగారి జీవితచరిత్ర, వారిసారస్వతసేవ మరియు సారస్వతమునకు గ్రంథాలయమునకు గల సంబంధమును గురించి యుపన్యసించిరి, శ్రీయుత పెండ్యాల సత్యనారాయణరావుగారును నిపుణముగా ఉపన్యసించిరి.

## ౨౫ వ ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభ

తెలంగాణాలోని అన్ని ప్రజాఉద్యమాల్లోనూ వరంగల్లుజిల్లా ప్రధానస్థానాన్ని ఆక్రమించుకొన్నట్టే గ్రంథాలయోద్యమ విషయంలోకూడ మనజిల్లా ముందంజవేసింది. ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభనుగూడా ,మనమాహ్వానించుటవల్ల మన రాష్ట్రంలోని గ్రంథాలయోద్యమములో ఒకనూతన దశను ప్రారంభింపజేసిన వారమవుతాము- ఈ మహాసభను అత్యంత జయప్రదంగా నెరవేర్చి మన జిల్లాప్రతిష్ఠను కాపాడెదరుగాక,

ఈ మహాసభను తెలంగాణాలో జరపటంలో మనభవిష్యత్తులో ఉజ్జ్వల పంథమునుమార్పు రాగలదు- శాస్త్రీయమైన గ్రంథాలయ నిర్వహణ పద్ధతులను ఆధునిక విజ్ఞాన ప్రచారమార్గాలను,నయోజనుల్లో సులభంగా విద్యా వ్యాప్తి చేయగల మార్గాలను ప్రపంచ గ్రంథాలయచరిత్ర మొదలైన విషయాలు దేశీయులకు ముఖ్యంగా ప్రజాసేవకులకు నేర్చుకొనే అవకాశం ఏర్పడుతుంది- ఇది కేవలం వైజ్ఞానిక మహాసభ కాబట్టి వివిధ విజ్ఞానవేత్తల పరిచయం కలుగుతుంది, బ్రిటిషు,నిజాంరాష్ట్రాంధ్రులు ఉభయులకూ ఇది సమిష్టి ఉద్యమం కావటంవల్లనూ ప్రతినిధులు వివిధఆంధ్రప్రాంతాలవారు కావటంవల్లనూ పరస్పర పరిచయమువల్ల అన్యోన్య సుహృద్భావం పెంపొందగలదు-

ఈ మహాసభకు మనరాష్ట్రీయులు విరివిగా విచ్చేసి మహాసభలో పాల్గొని పూర్తిగా ప్రయోజనంపొంద వలయును; అందరికి అందులో ఉండుటకు గాను, ప్రతినిధి రుసుము ఒక రూపాయి నిర్ణయింపబడినది.

వరంగల్లు జిల్లా వాస్తవ్యులంతా ఆహ్వానసంఘ సభ్యులంగా చేరి ఆహ్వాన సంఘానికి అన్నివిధాలా తోడ్పడ వలెను- ఆహ్వానసంఘ ,సభ్యత్వరుసుము మూడుమూపాయిలుమాత్రమే-

వరంగల్లు జిల్లాలోని సోదరదేశసేవకులంతా విరివిగా ఆహ్వానసంఘ సభ్యులను చేర్పించి విరాళాలను ప్రోగుచేసి తోడ్పడ ప్రార్థన-రాష్ట్రములో వివిధదేశసేవకులు ఈసందర్భమును పురస్కరించుకొని గ్రంథాలయ యాత్రలు పూర్వకముగా ప్రచారము చేయుట మంచిది-

ప్రతిగ్రామం లో, ఏదైనగ్రంథాలయము పరసమం ఒరము లేదా పయోజనప్రచార సంస్థ వల్లనో ఎప్పుడో బడియుండవలెను. లేదా ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘ సభ్యులైయుండవలెను కాబట్టి వ్యక్తిగతంగా ప్రతినిధులు గా రావలయువారు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంలో చేరవలెను-

## ఆంధ్ర విద్యాలయము

౧. ఇంటర్మీడియటు ౬౦౦ రూపాయిల విలువగల సైన్సు లేబరేటరీసామాను తెప్పించియుంచినాము,

౨. ఫర్నిచరు సమగ్రముగా కూర్చబడినది, ఇక రావలసినవన్నియూ, మ్యాపులు, ఛార్టులు, మున్నగునవి సమకూర్చబడినవి.

౩. ఇద్దరు గ్రాజుయేట్లు ఇద్దరు ఇంటర్ కడతేరినవారు, పలుగురు మెట్రికులు నియమింపబడినారు మాన్యువల్ బోధకుడు డ్రిల్ డ్రాయింగుపంతులు, క్లార్కు నియుక్తులైనారు. ౧౫ ఏండ్ల ఉపాధ్యాయ వృత్తిలోనుండి, పఖ్యాతులైన ఒక బి. ఏ. బి. టి. ఆంధ్ర విద్యాధికుడు ప్రధానోపాధ్యాయులుగా నియుక్తులైనారు, కాని వారిప్పుడుండు పాఠశాలవారు మూడునెలల నోటీసుకోరి వారిని వదలనందున వారువచ్చుటకు ఇంకారెండునెలలు పట్టును;

౪. విద్యాలయమునకు గాను, పుస్తకాలయమును ప్రారంభించినాము అప్పుడేయింతుమించు ౧౨౦ పుస్తకాలవరకు సమకూడినవి అందుచేత ఉర్దూ తెలుగు నిఘంటువును (కొండల్‌రావుగారిది) ఉర్దూ నిఘంటువు శ్రీ మంతు రాజాబహద్దరు వెంకటరామారెడ్డి గారును బ్రౌను ఇంగ్లీషు తెలుగు నిఘంటువును (అరుదైనలంపక ఇటాళీని) శ్రీ గ॥ రామకృష్ణారెడ్డిగారును ౨౦ ఇంగ్లీషు పుస్తకాలను శ్రీ శ్రీ శ్రీనివాసరావుగారును ౧౦ తెలుగుపుస్తకాలను ఒసగు పదాత అనుగ్రహించినారు. మిగతవి స్కూల్‌కై కొనబడినవి, ముందుముండి క్రమముగా హైస్కూలుతరగతులను ప్రారంభించుటకై బాలకవర్గము వారధిలషించుచున్నందున స్కూలుకు మంచి పుస్తకాలయము చాలా అవసరము. గ్రంథదానము చేయుదలచినవారు ఇంగ్లీషు ఉర్దూ తెలుగు పుస్తకాలను దానము చేయగలరని ప్రార్థన;

---

నరేంద్రమండలికి సంబంధించిన ప్రధాన మంత్రులసభకు సర్- కృష్ణమాచారిగారు అధ్యక్షులుగా నుండిరి, వారు ఆ పని చాలించుకొన్నందున వారి స్థానములో హైదరాబాదు ప్రధానామాత్యులు నియమింపబడినారు;

## వెంకట క్రిష్ణాపురము

### జి॥ మెదకు

ఈ గ్రామంలో యథాపూర్వముగా ఆషాఢశు॥౧౧ ఏకాదశి శ్రీపాండురంగస్వామిఉత్సవము జరుగును రాంభావు అనేవారు జాతరకు వచ్చే సాధువులకు గంజాయి ఉచితముగా పంచి పెట్టినారు గంజాయి త్రాగేవారు యీ సంవత్సరము జాతరలో సుమారు స్త్రీ పురుషులు (౫౦౦)మంది ఉండిరి. మూసుగాల జానకారెడ్డిగారు ప్రచారము గావించి కరపత్రములు పంచిపెట్టిరి. మొత్తముపై సుమారు (౫౦౦) మంది మద్యముల వాడమని ప్రమాణముగావించిరి

ఈ కరువుకాలములో శ్రీపాండురంగు కిరాంభావుగారు గంజాయి యాత్రికులకు ఇచ్చిప్రోత్సాహ పరచుట చాల విచారకరమైన విషయము

## ఊరినుండి రాతం ధాన్యం తెచ్చుకోవచ్చు కాని

రాతం కచ్చేరీవారు ౯-౧౦-౫౩ నాటి ఈ విధంగా క్రొత్తశాసనం వెళ్ళడిచేసినారు. ఎవ్వరైనా తమ జాగీరు, ముఖ్తా లేక సేద్యముచేసి, లేకపేరే పద్ధతివెంట కానీ, తనకుటుంబానికై హైదరాబాదు రాతహద్దులలోనికి రాతం క్రింద ఏర్పాటైన వస్తువులను తెచ్చుకొనదలచితే వారు రాతంయొక్క నాయిబు వద్ద సెలవుపొందవలెను అయితే అది సెలకంటె యెక్కువ అవసరానికు తెచ్చుకోగూడదు తెచ్చుకొన్న మొత్తం వరకు అట్టివారి రాతం పట్టీనుండి రాతం కొట్టివేయబడును. ఏజిల్లానుండి రాతంధాన్యం తెచ్చుకొంటారో ఆజిల్లా తాలూకాదారు సెలవుకూడా కావలెనియుండును"

## బాబెహుకూమతు మార్పులు

మ. ఘ. వ. నిజాం ప్రభువుగారిట్లు ఫర్మాయించినారు—

"సర్ అఖిల్ జంగ్ చాలాకాలం విశ్వాసంగా పనిచేసినాడు అతడు ౧ మెహర్ ౧౩౫౩ నుండి మంత్రిత్వమునుండి విరమించుకొనును. యుద్ధకాల వరకు అతడుపూర్వం ఫరీమాన్ మాల్కుండినట్లుగా కచ్చేరీల పెత్తనంలేని అసాధారణ బాబెహుకూమతు మంత్రిగా నుండును. ప్రధానసంస్థ రాష్ట్రంబయటికి వెళ్ళినప్పుడు అతడు ఆస్థానములో పనిచేయును. ఇప్పటిపాయిగా అవిార్లు ఉన్నవారు అనుభవంలేనివాడు మూడు పాయిగాలకు సదరుల్ ముహాంగా ఇకన్ని ఏర్పాటుచేయుచున్నాను సర్ అఖిల్‌జంగు స్థానములో జైన్‌యార్జంగును నియమించుచున్నాను. అతడు నిర్మాణశాఖ మంత్రిగానుండును రాజా నరంశరాకు వేరేశాఖ యియ్యబడును-

## లేఖలు

మ. రా. గోలకొండపత్రికా సంపాదకులగారికి.

ఆర్యా వందనములు.

పత్రికాప్రకటనార్థమై ఈవార్త పంపుచున్నాను. నేను ౨౭–౯–౫౩ తేదినాడు సాయంకాలము ౪–౧౫ గం. కు జనగామునుండి సింగరాజుపల్లి పోదలంచి బస్సులో జనగామునుండు ఎక్కపోతిని. ౧౫౦ నెం. గల బస్సులోను న్న ఇద్దరుకండక్టర్లు రాజకాల లాటరీటిక్కెట్లు తీసుకొన్నచో బస్సులో స్థలమునిచ్చెదమని నన్నుఅపిరి. ఆవిధముగా ఇతరులు ఎక్కుచుండగా వారు గూడ ఆపబడిరి. ఈవిధముగా ౧౪, ౧౫మంది లాటరీటిక్కెట్లు తీసుకొనమునిరాకరించగాము మ్మల నందరిని వదలి బస్సుతీసుకొనిపోవుటకు ప్రయత్నించిరి. దానిపై మాకుప్రెంతో అవసరపనులు నుండుటవలన విధిలేక ఎక్కవలెను వెంటలేకున్ననూ ఎట్లోసరిపుచ్చుకొని నేను వారిచ్చే టిక్కెట్లు తీసుకొని ( లాట్రీనెం. 2058, 71,81, 82, 83, 85, 86. 93, ) బస్సులో ప్రయాణముఅయ్యినాము. ఈవిధముగా నిర్బంధముగా లాటరీటిక్కెట్లు తీసుకొనవలసిరావుటవలన, ప్రయాణీకులకు ఎంతోకష్టముగానున్నది. రైల్వే అధికారులు తక్షణమే విచక్షణగావించి మున్ముందు ఈవిధముగా ప్రయాణీకులను నిర్బంధపర్చకుండునట్లు కండక్టర్లపై తగుచర్య తీసుకొందురని నమ్ముచున్నాను.

ఇట్లు

సాదినేని ధర్మయ్య

భువనగిరితాలూకాఆంధ్రమహాసభ అధ్యక్షుడు

తేది ౩౦–౯–౫౩

---

రాతం శాఖవారికి

మహాశయులారా, అంశకోలత యజమానులారా! కాస్త ఇటు అనుగ్రహించండి. మేము జొన్నన్నము జొన్నపిసరు, జొన్నరొట్టెలు. బాజాఅట అంటే సజ్జలమెరుగము చూచియెరుగము. మాకొరకై మాఅరోగ్యంకొరకై తాము బెంగపెట్టుకొని దుఃఖించవద్దండి! మాగతిమాకే మీగతిమీదే. మాగ్రహచారం మీకువద్దులెండి. మేము గ్రహసంచార బలముచేత తెలంగాణాలో పుట్టినాం. మధ్యరకం మనుష్యులంకాబట్టి, పుట్టిననాటినుండి నేటివరకు తెల్లనిసన్ననిబియ్యమే తిన్నాం ఇప్పుడు రాతంమూలాన ౩౫ ప్రతిశతం తవుడుతీసినబియ్యమట మాకుబాక్కుటకిస్తున్నారు మాకశరానికి శతం తవుడుపోయినబియ్యమలవాటు, మిగత ౬౫ ప్రతిశతం తవుడుతినుమంటే మాతో కాదు, గోడుగుతూ మూల్గుతూ ఎక్కువధరయిచ్చి ౩౫ తవుడుపోయినబియ్యంతీసుకొనిపోయి యింట్లో మువ్వవాటలలోపడంచుకొంటాము. కొన్ని సేర్లతవుడుపోతుంది. కొన్ని సేర్ల నూకలు చూర్ణంపోతుంది. మిగతది వండుకుంటే అవి మాకు ఇంకా ఎర్రగావుంటుంది. నోట్లోకిపోదు మాకీఅన్నంతీరు ఇంటూనే భయమేస్తుంది. అట్టి వాటులేని జొన్నరొట్టెలైనా కాస్తసాధించిసాధించి నమిలితానుకాని యీబియ్యంమాత్రము మాగొంతులో కట్టుకుంటది- గోధుమలధర చాలాయెక్కువ- జొన్న మంచివిరావు-సన్నబియ్యం మాకింతవరకు దొరకలేదు- ఎన్నడో ఒకనాడు సన్నబియ్యమనేది వస్తవట. దుకాణదారునిమిత్రులకే సరిపోతవట- ఇదెంతనిజమో? ప్రతివారికిన్నీ సన్నబియ్యము లెక్కప్రకారము దొరకేట్లు గావించరాదా? బియ్యము నానాగోత్రాల విగానుండును. కొన్నిమారులంపటచేస్తేమాడ్వయిపోతుంది మీరుమంచిబియ్యముసప్లయిచేయలేకుంటే బియ్యంపైన రాతం తీసివేయరాదా? కోపం చేసుకోకుండా మాకష్టాలు గమనించండి మహాప్రభో! గజెట్ అధికార్లనున్నూ మాకుదొరికే నానాగోత్ర పవిత్రస్థాలతండుల మహాభాగ్యం లభించునన్నదోలేదో పాపం!!

ఇట్లు ఆబిద్‌షాపువద్ది

అఘోరించే ప్రజలు

---

జోగిపేటలో టప్పాకార్యాలయ పక్కన బస్సుస్టాండుకు ఎదురు విశాలస్థలములో నవీనపద్ధతితో మహమ్మదు యిస్మాయిల్‌ఖాను సాబు వకీలుగారి అధ్వర్యమున సర్కారీఉద్యోగులు మొదలయినవారి యిష్టముచే సాహుకార్లు మొదలయినవారి చందాలనుండి గొప్ప గ్రంథాలయభవనము కట్టబడుచున్నది, సగం అయినది- కొద్దిమాసములలో సంపూర్తి కావచ్చును.

---

చందా వివరాలు

Vol. 22

# గోలకొండపత్రిక

Golkonda Patrika

Published every Monday ... Hyderabad ...

The ... Paper that reaches the masses in the Dominions

BEST MEDIUM — FOR — ADVERTISEMENT

20—7—1944

# వ్యాపారపంటల సాగుపై

## చేయబడిన నిర్బంధ నియమము

### పీఠిక

వ్యాపార పంటల సాగును నిరుత్సాహపరచి ఆహారపంటల సాగును హెచ్చించు ఆవశ్యకత కల్గుటచేతను, వ్యాపార పంటలను నిరుత్సాహపరచుటకు ఆ పంటల పైనను, ఆ పంటల ఫలసాయము పైనను పన్ను విధించుట అత్యుత్తమమార్గమని మ. ఘ. వ. శ్రీ నిజాం ప్రభుత్వమువారు తలచుటచేతను ఈ క్రింది విధముగ ఆజ్ఞాపింపబడుచున్నది.-

### లఘునామము — వ్యాప్తి — ప్రారంభము

౧. ఈ నియమము వ్యాపార పంటల సాగుపై చేయబడిన నిర్బంధ నియమమని పిలువబడవచ్చును. జరీదాలో ప్రకటింపబడిన తేదీనుండి ఇది మ. ఘ. వ. శ్రీ నిజాం రాజ్యమంతటియందును అమలులోనికి వచ్చును.

### నిర్వచనములు

౨. ఈ నియమములో విషయమునందును సందర్భమునందును అన్యథా ఉండిన తప్ప,

(అ) "కాష్‌క్రాప్స్" లేక వ్యాపార పంటలు అనగా పత్తి, వేరుసెనగ లేక కార్యనిర్వాహకవర్గ సమేతుడగు ప్రభుత్వాధ్యక్షుడు సమయానుకూలముగ జరీదాద్వారా తెలియబరచు ఏ యితర పంటలైనను.

(ఆ) "ఆహార పంటలు" అనగా జొన్నలు, బాజ్రా, వరి, గోధుమలు మొక్కజొన్న, చోళ్లు, శనగ, సావలు, కంగ్ని, అన్నిరకాల పప్పుదినుసులు, లేక కార్యనిర్వాహకవర్గ సమేతుడగు ప్రభుత్వాధ్యక్షుడు జరీదాద్వారా తెలియజేయునవి.

(ఇ) "ఆమోదింపబడిన మిశ్రమము" అనగా ఈ నియమము క్రింద నిర్దిష్ట ప్రాంతములకొరకు అప్పుడప్పుడు ఆదేశింపబడు ఆహార పంటలకును, వ్యాపార పంటలకును ఉండవలసిన సంబంధ సామ్యము.

(ఈ) "వ్యవసాయభూమి తన అధీనములో నున్నవాడు" అనగా పట్టేదారుగా గాని, శిక్మీదారుగా గాని, హిస్సేదారుగా గాని ఆసామీషిక్మీగా గాని శిర్వీదారుగా గాని ఉన్నవారు.

(ఉ) "అమ్మకము" అనగా దాని సమస్త వ్యాకరణ భేదముల తోడను ఒకరికి మరొకరు, వర్తక వ్యాపారరీత్యా ఒక వ్యాపారపంటను నగదు ప్రతిఫలము పొందిగాని, అప్పుపై గాని, మరే విలువకైన గాని ఇచ్చుట, ఈ మాట గిర్వీ. కుదువబెట్టుట, హైపాథికేషన్ పార్టికి చెల్లదు.

### వివరణము

అద్దె- అమ్మకము పద్ధతిపైగాని, కిస్తుపద్ధతిపైగాని ఇచ్చినప్పటికి అది "అమ్మకముగనే భావింపబడును."

(ఊ) "వ్యాపారపంటల ఫలసాయము యొక్క వివిధదశలు", అనగా పత్తివిత్తనములు తీయుట, అనుములు, వేరుసెనగ పొట్టు తీయుట, నూనె తీయుట ఇతర విధముగా దానిని తయారుచేయుట ఈ నియమములో వివరింపబడిన ఇతరములగు పనులింకులో జేరును.

(ఋ) "నియమింపబడిన" అనగా ఈ నియమము క్రింద నియమింపబడిన.

(ౠ) ఇందులో నిర్వచింపబడని పదములకు ౧౩౧౩ ఫ. హైదరాబాద్ ల్యాండ్ రెవిన్యూ యాక్టు నెం ౮ లో ఈ పదములకు ఏ అర్థమో అదే అర్థముగ గ్రహించవలెను.

### వ్యాపార పంటల పన్ను

3.(౧) ౭వ దఫాయందలి నియమముల క్రింద వ్యవసాయభూమికల ప్రతివాడును తన భూమిలో పండు వ్యాపార పంటలపై మామూలు మాల్గుజారీకి అదనముగా ప్రభుత్వమునకు ఒక పన్ను కార్యనిర్వాహకవర్గ సమేతులగు ప్రభుత్వాధ్యక్షుడు నిర్ణయించునట్లు ఇవ్వవలెను. అట్టి పన్ను రేటు ఈ క్రింది హద్దును మించరాదు.

వేరుసెనగ పంటకు ..అట్టి భూమిపై చెల్లించు ధారాకు మూడింతలు. పత్తి లేక మరేవ్యాపార పంటకైన.. ను .అట్టి భూమిపై చెల్లించు ధారాకుధారాకు రెండింతలు.

(౨) సర్వే. సెటిల్‌మెంట్ చేయబడ్డ ఖాల్సేతరభూములలో వ్యాపార పంటపన్ను సబ్‌సెక్షన్ (౧) లో నియమింపబడిన ప్రకారము విధింపబడును

(౩) సర్వే, సెటిల్‌మెంట్ చేయబడని ఖాల్సేతర భూములలో వ్యాపారపంటపన్ను కార్యనిర్వాహకవర్గ సమేతుడగు అధ్యక్షునిచే నిర్ణయింపబడిన ... ఎకరమునకు రూ. ౩ లు మించకుండా విధింపబడును

### వ్యాపార పంటలపై వచ్చిన ఆదాయము ప్రభుత్వ ఖజానాలో జమచేయబడును

౪. వ్యాపార పంటలపన్నుపైవచ్చు సమస్త ఆదాయమును ప్రభుత్వ (దీవానీ) ఖజానాలో జమచేయబడును.

### వ్యాపారపంటలపైపన్ను భూమిపన్ను బాకీలుగా వసూలు చేయబడును

౫ 1. నియమముక్రింద ఒక వ్యక్తినుండి రావలసిన వ్యాపారపంటల పన్ను భూమిపన్నుతోను, దానికి సంబంధించిన బకాయీలుగను వసూలు చేసుకొనబడును

2. ఖాల్సేతర భూములలో భూమిపన్ను వసూలుచేయుటకు ఏర్పాటైయున్న మనుష్యులే దీవానీ తరఫునుండి ఈ నియమముక్రింద రావలసిన పన్నును వసూలుచేసెదరు- అట్లుచేసి తమకు దగ్గరనున్న దీవానీ ఖజానాలో జమచేసెదరు

3. కార్యనిర్వాహక వర్గసమేతులగు ప్రభుత్వాధ్యక్షులు వ్యాపార పంటలపన్ను వసూలుచేసిన గ్రామోద్యోగులకు కమిషను ఇవ్వవచ్చును

### ఆమోదింపబడిన మిశ్రమములు

౬. ఈ నియమముక్రింద చేయబడిన నిబంధనల ననుసరించి కార్యనిర్వాహకవర్గసమేతులగు ప్రభుత్వాధ్యక్షులు నిర్ణీతప్రాంతములలో ఆమోదింపబడిన మిశ్రమములను విధించును- ఆహారపంటల క్రిందను వ్యాపారపంటలక్రిందను ఉన్న భూమియొక్క సంబంధసామ్యము నందలి మార్పువిషయమై వ్యవసాయకాలమునకు చాలినంత ముందే తెలియపరచబడును-

### ఆమోదింపబడిన మిశ్రమముల ప్రకారము సాగుచేయువారికి సౌకర్యములు

౭. (౧) ఒక వ్యవసాయదారుడు ఆమోదింపబడిన మిశ్రమముల ప్రకారం వ్యవసాయము చేసినయెడల అతడు వ్యాపారపంటల పన్ను చెల్లింపనక్కరలేదు- ప్రభుత్వమువారిచే నిర్ణయింపబడిన ధరలకు తన ఆహారపంటలను ప్రభుత్వమువారికి అమ్మహక్కు లభించును- హైదరాబాదు కమర్షల్ కార్పొరేషనుయొక్క సమీపతరమగు గోదాములో ఈపంట చేర్చబడును-

(౨) సబ్‌సెక్షన్ ౧ క్రింద ప్రభుత్వమువారి నియమము ప్రకారము వర్తించు ప్రతి వ్యవసాయదారుడు తమ హక్కునిమిత్తము తన ప్రాంతమునకు చెందిన గిర్దావరుకు గాని, కార్యనిర్వాహకవర్గ సమేతుడగు ప్రభుత్వాధ్యక్షుడు నియమించిన మరే అట్టిఅధికారికి గాని దరఖాస్తు పెట్టుకొనవలెను.

(౩) సబ్ సెక్షన్ (౨) క్రింద దరఖాస్తు నిరాకరింపబడినచో తాలూక్దారు గాని అవ్వల్‌తహసీల్దారు ఆజ్ఞలను అపీలుపై మార్చవచ్చును.

(౪) ఆ ఆజ్ఞపై కూడ మురాఫా చేసుకొనిన యెడల సుబేదారు, తాలూక్దారు ఆజ్ఞలను మార్చవచ్చును అతని తీర్పు నిష్కర్షమైనది.

### అమ్మకపు పన్ను

౮. (౧) మూడవ సెక్షన్ క్రింద విధింపబడు వ్యాపార పంటల పన్ను కాక ప్రభుత్వమువారు అమ్మకపు పంట విధింతురు. ఇది వ్యాపారపంటల అమ్మకముపై విధింపబడును. దాని రేటు అమ్మకము ధరపై నూటికి ౫ కు తక్కువ కాకుండా ౧౫ కు ఎక్కువ కాకుండా విధింపబడును. ఒక్కసారి అట్టి వస్తువుకు అమ్మకపు పన్ను ఇచ్చినచో తర్వాత అమ్మకముల కివ్వనక్కరలేదు-

(౨) (౩) నుండి ౭ వరకుగల సెక్షన్ల సబ్‌సెక్షన్ ౧ క్రింద అమ్మకపు పన్ను విధించినపుడు దాని ఆదాయము మున్నగు విషయము లలో వ్యాపారపంటల నియమములే దీనికి వర్తించును-

### వివరణ

౯. ఈ నియమముక్రింద ఏ సివిల్‌కోర్టుయందు వ్యాజ్యము కాని, దరఖాస్తు కానిమరెట్టి చర్యకాని తెసుకొనరాదు-

ఈ నియమము క్రింద వచ్చిన ఆదాయము యొక్క

### వినియోగము

౧౦. ఈ నియమముక్రింద విధింపబడిన పన్నుల ఆదాయమును ఒక ప్రత్యేకనిధిగా ఏర్పరచి ఆ డబ్బుతో తమకు తోచిన విధమున ఎక్కువ ఆహారదినుసుల పంటలను ప్రోత్సహించుటకై ఖర్చు పెట్టుదురు-

### నిబంధనలు చేయు అధికారము

౧౧. కార్యనిర్వాహకవర్గ సమేతుడగు ప్రభుత్వాధ్యక్షుడు ఈ నియమము క్రింద నిబంధనలు చేయు అధికారము కలిగియున్నాడు-

---

### చందాదారులకు గమనిక

మీకు మా ... నుండి జవాబు, అవసరమున్న జవాబి కార్డులు వ్రాయుండి.

మీమీ కాయితములమరముకావలెన్న మీ చందా నంబరుతో సహా వ్రాయుండి ఇట్లు

గోలకొండ కార్యాలయము